# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్రశ్రీభాష్యము.



భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము

హానరెబిల్ శ్రీరాజా గోడేనారాయణగజపతిరాయనింగారి

సెలవుప్రకారము

శ్రీపరవస్తుశ్రీనివాసజగన్నాథస్వామియయ్యవారలుఁగారిచేఁ
దెనుఁగుచేయఁబడి

వారిసెలవుప్రకారమె

ముద్రింపఁబడినది.

౧ సంచిక.

PUBLISHED BY

SreeParavastu Sreenivasa Jagannadhaswami Ayyavaralugaru.

Printed by D. Gurranna at the Arsha Press,

Vizagapatam, 1890.

వి॥ అ॥ మహత్తత్త్వము మొదలుకొని విశేషపర్యంతమైన తత్త్వములు ఒకదానికొకటి యాశ్రయముగాఁగలవియై అన్యోన్యమును సంయోగమునుపొంది అండమును పుట్టించుచున్నవి-) సూత్రకారుఁడుగూడ (౩అ॥౧పా॥౬సూ॥) త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ (ఉదకము త్రి) వృత్కరణముచే మూడుభూతములనును గలిగియున్నదిగాన ఆపః అనునది మిగిలిన భూతములతోఁగూడిన జలమును జెప్పును- ఉదకము విస్తారముగాఁగలిగియుండుటచేత దానిపేరునఁజెప్పఁబడుట) అనుసూత్రము చేత మూడాకారములునుగలిగియుండుటను జెప్పెను- విస్తారము ఒక్కొక్కభూతము కలిగియుండుటచేత నామభేదము కలిగినది- సోమలత లేనియప్పుడు పూతీకములను(పూతిక యనెడితీగములకలను-) స్వీకరించుట శ్రుతిలోఁజెప్పఁబడినది- అది,సోమలతయొక్క యవయవములు పూతీకములలోనుండుటనేయని మీమాంసకులు చెప్పుదురు- వ్రీహులు(వడ్లు)లేనియప్పుడు నీవారములను(నెవరధాన్యములను) గ్రహించుటయును నెవరధాన్యములలో వ్రీహియొక్క యవయవము లుండుటనే- ఏవస్తువు ఏవస్తువుయొక్క యవయవములు కలదో ఆవస్తువు ఆవస్తువుతో సదృశమైనది-* ముత్తెపుచిప్ప మొదలగు దానియందు వెండి మొదలగునది కలిగియుండుట శ్రుతిచేతనే తెలియఁజేయఁబడినది- వెండియనియు ముత్తెపుచిప్పయనియు వేఱు వేఱుగాఁజెప్పుట ఆయాయవయవములువిస్తారముగాఁగలిగి యుండుటనుబట్టి వచ్చినది- ముత్తెపుచిప్ప మొదలగునది వెండి మొదలగుదానితో సదృశమైనదిగాఁ గనఁబడుచున్నది- కాఁబట్టి ముత్తెపుచిప్ప మొదలగుదానియందు వెండి మొదలగునదియుండుట మనకట్లు కనఁబడుటవల్లనె నిశ్చయింపఁబడినది- ఒకానొకప్పుడు కన్ను మొదలగువాని దోషమువలన ముత్తెపుచిప్పభాగముకాక వెండిభాగము గ్రహింపఁబడును- అందువలన వెండి కావలసినవాఁడు దానియందుఁబ్రవర్తించును-దోషముపోయినతోడనె ముత్తెపుచిప్పభాగముగ్రహింపఁబడఁగా నివర్తించును-కాఁబ

*ఈయంశము పూర్వ మీమాంసలో ౬ వయధ్యాయమున ౩ వపాదమున ౧౧ వయధికరణమున వ్రాయఁబడినది— జైమినీయ న్యాయమాలావిస్తరమునఁ జెప్పఁబడును.

ట్టి ముత్తెపుచిప్ప మొదలగుదానియందు వెండి మొదలగునదియనెడిజ్ఞానము యథార్థమైనది. ఒక జ్ఞానము బాధింపఁబడునదియగుటయు ఒక జ్ఞానము బాధించునదియగుటయుఁగూడ భూయస్త్వముచేతనే కుదురుచున్నది. (ఏవస్తువు విస్తారముగానుండునో ఆవస్తువని తోఁచుట స్వల్పముగానుండెడి వస్తువని తోఁచుటను బాధించును). ముత్తెపుచిప్పను చూచి వెండియని తోఁచినప్పుడు ముత్తెపుచిప్ప భాగము విస్తారముగా లేకపోవుటను తెలిసికొనట భ్రమము. అంతయును ముత్తెపుచిప్ప భాగమేయని తెలిసికొనుట బాధము. కాఁబట్టి అసత్యమైన విషయముగలజ్ఞానము బాధింపఁబడునదియగుటయును సత్యమైన విషయముగల జ్ఞానము బాధించునదియగుటయును లేదు. అన్నివస్తువులును అన్నివస్తువుల స్వరూపములుగలవైనను వ్యవహారము ఏర్పాటుగానుండుట ఈ చెప్పినపక్షముననే.

౧-౨౨ స్వప్నమునందుఁగూడ ప్రాణుల పుణ్యపాపానుసారము భగవంతునిచేతనే ఆయాపురుషులచేతమాత్రమే అనుభవింపఁబడఁదగినవియును ఆయాకాలముననే కడతేరునవియును ఆయావిధముగా నుండునవియునగు పదార్థములు సృజింపఁబడుచున్నవి. స్వప్నమునుగూర్చినశ్రుతి అట్లేకదా చెప్పుచున్నది. (బృ॥౬॥౩॥౧౦) నతత్ర రథా నరథయోగా నపంథానో భవన్తి అథ రథాన్ రథయోగాన్పథస్సృజతే నతత్రానన్దా ముదః ప్రముదో భవన్తి అథానన్దాన్ముదః ప్రముదస్సృజతే నతత్ర వేశాన్తాః పుష్కరిణ్యస్స్రవన్త్యో భవన్తి అథ వేశాన్తాన్ పుష్కరిణీస్స్రవన్తీస్సృజతే సహికర్తా. (అచ్చట రథములు లేవు రథముతోఁ జేర్పవలసినవి లేవు మార్గములు లేవు ఇఁక రథములనును రథముతోఁ జేర్పవలసినవానిని మార్గములను సృజింపుచున్నాఁడు. అనుభవింపవలసినవానిని చూచుటవలనఁగలిగెడి సంతోషములును అవి తనవగుటచేఁగలిగెడి సంతోషములును వానిని వాడుకచేయుటచేఁగలిగెడి సంతోషములును అచ్చట లేవు. ఇఁకను అట్టి సంతోషములను సృజింపుచున్నాఁడు. అతఁడు సృష్టికర్తగదా) అని. అవియప్పుడు మిగిలిన పురుషులు అందఱును అనుభవింపఁదగినవిగా నుండునను ఆయాపురుషుఁడు మాత్రము అనుభవింపఁదగినవానిగా

ఆయాపదార్థములను ఈశ్వరుఁడు సృజింపుచున్నాఁడు- సత్యసంకల్పుఁడును అద్భుతమైన శక్తికలవాఁడునగుఆతనికి అట్టికర్తృత్వ ము సంభవించును- అట్టియర్థము- (కఠ॥౫వల్లి॥౮మ॥) య ఏష సుప్తేషు జాగర్తి కామం కామంపురుషో నిర్మిమాణః। తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే। తస్మింల్లోకాశ్శ్రితాస్సర్వే తదు నాత్యేతి కశ్చన (అందఱును నిద్రపోయిన వారగుచుండఁగా సంకల్పించి సంకల్పించి సృజించుచున్నవాఁడై పురుషుఁడు మేలుకొనుచున్నాఁడో ఆతఁడే ప్రకాశింపఁజేసెడివస్తువు- ఆతఁడె బ్రహ్మము- ఆతఁడె అమృతమని చెప్పఁబడుచున్నాఁడు- ఆతనియందె లోకములన్నియు నాశ్రయించియున్నవి- ఒక్కఁడును ఆవస్తువును అతిక్రమింపలేఁడు-) అని యుపశ్రుతికలదు- సూత్రకారుఁడుగూడ (౩॥౨॥౧) సంధ్యే సృష్టిరాహ హి (స్వప్నమందలి సృష్టి జీవునిచేఁ జేయఁబడినది- అట్లు శ్రుతి చెప్పుచున్నదికదా) (౩॥౨॥౨) నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ (కొందఱు అనఁగా కఠశాఖవారు ఈజీవునినె నిర్మించువానిగాఁ జెప్పుచున్నారు- కామశబ్దముచేత పుత్రుఁడు మొదలగువారు చెప్పఁబడుచున్నారు-) అను రెండుసూత్రములచేతను స్వప్నమందలి పదార్థములమొదను జీవుఁడు సృజించువాఁడగుటను శంకించి (౩॥౨॥౩) మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్ (అది ఈశ్వరుని మాయామాత్రము- జీవుఁడు సంపూర్ణముగా స్ఫుటపడని స్వరూపముగలవాఁడగుటవలన) ఇదిమొదలగు దానిచేత, జీవుఁడు సంకల్పమాత్రముచేత సృజించువాఁడగుట సరిపడదు, జీవునియొక్క స్వభావసిద్ధమగు సత్యసంకల్పత్వము మొదలగునదియంతయును సంసారదశయందు స్ఫుటపడని స్వరూపముగల వలన, ఆయాపురుషుఁడు మాత్రము అనుభవింపఁదగినదగుటచే ఆశ్చర్యమైన ఈసృష్టి ఈశ్వరునిదె, (కఠ॥౫వల్లి॥౮మం) తస్మింల్లోకాశ్శ్రితాస్సర్వే తదు నాత్యేతి కశ్చనఅను శ్రుతిచేత పరమాత్మయే అచ్చట సృజించువాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు, అని పరిహరించుచున్నాఁడు-గది మొదలగు వానియందును స్నానముచేసి కలగనువానికి తనశరీరముతో నేదేశాంతరమునకుఁ బోవుట రాజ్యాభిషేకమును పొందుట శిరశ్ఛేదమును పొందుట మొదలగునవి పు

ణ్యపాపముల ఫలములైయున్నందు దేహముతో సమానమైన యా
కారముగల మణియొక్క దేహమును సృజించుటచేఁ గుదురుచున్నవి.

౧౨౨. శంఖముపచ్చగానుండుట మొదలగువానియందు నేత్ర
ములయందుండెడి పిత్తముతోఁ జేరిన నేత్రకిరణములు శంఖము మొద
లగువానితోఁ జేరుచున్నవి. అచ్చటపిత్తము యొక్క పసపుచాయచేత
ను తిరస్కరింపఁబడినదై శంఖమునందుండెడి తెలుపు గ్రహింపఁబడ
దు. కాఁబట్టి బంగారుపూసిన శంఖమువలె పచ్చనిదని శంఖము తెలి
యఁబడుచున్నది. ఆపిత్తంబును దానియందుండెడిపసపుచాయయును
మిక్కిలిసూక్ష్మమగుటవలన పక్కనున్నవారలచే గ్రహింపఁబడవు.
సూక్ష్మమైనను తనకన్నునుండి బయలుదేరుటను అతిసమీపముగానపి
త్తదోషముగలవానిచేతను గ్రహింపఁబడుచున్నవి. వానినిగ్రహించుట
చేఁగలిగిన సంస్కారముతోఁగూడిన నేత్రకిరణములచేతనుదూరము
ననున్నదైనను గ్రహింపఁబడుచున్నది.

జపాపుష్పము (దీనినిమందారపుష్పమని వ్యవహరిం
తురు) దగ్గఱనున్నస్ఫటికమణికూడ దానికాంతిచేతఁదిరస్కరింపఁబ
డుటచే నెఱ్ఱనిదిగా గ్రహింపఁబడుచున్నది. జపాపుష్పముయొక్క కాం
తి అంతటవ్యాపించినదైనను స్వచ్ఛమైన వస్తువుతోఁ జేరినది మాత్ర
మె మిక్కిలిస్ఫుటముగాఁగనఁబడుచున్నది. ఇయ్యది ప్రత్యక్షమును ప
ట్టియె ఏర్పఱుపవలసినది.

౧౨౪. ఎండమావులలో నీళ్లు దెలియుటయందుఁగూడ తేజస్సు
నందును పృథివియందును (త్రివృత్కరణమువలన) జలముకలదుగాన ఇం
ద్రియదోషమున తేజస్సును పృథివియును గ్రహింపఁబడకపోవుటవల్ల
నును జలముగ్రహింపఁబడుటవల్లనును యథార్థమగుట సందర్భిం
పుచున్నది.

౧౨౫. కొఱవిచక్రమునఁగూడ కొఱవి శీఘ్రముగాఁదిరుగుటచే
త అన్నిప్రదేశములతో సంబంధముగలుగుటచేతను ఎడతెఱపిగ్రహిం
పఁబడకపోవుటను అట్లు తోఁచుట కుదురుచున్నది. (వట్ట) చక్రముతోఁ
చునప్పుడుగూడ ఎడతెఱపి గ్రహింపఁబడక ఆయాప్రదేశముతోఁగూ
డియావస్తువును గ్రహించుటయొ? వీనిరెంటిలో నొక్కదానియం

దు ఎడ తెలిపి లేకపోవుటవలన ఎడ తెలిపి గ్రహింపఁబడకపోవుటయు మఱియొక్కదానియందు చుఱుకుఁలన గ్రహింపఁబడకపోవుటయు ననివిశేషము. కాఁబట్టి అదిగూడ యథార్థమే.

౧౨౬. అద్దము మొదలగు వానియందు తనముఖము మొదలగునది తోఁచుటకూడ యథార్థమే. అద్దము మొదలగువానిచేతను అడ్డఁబడిన నేత్రకిరణములు అద్దము మొదలగు వానిప్రదేశమును గ్రహించి తన ముఖము మొదలగు దానిగ్రహించును. అప్పటఁగూడ మిక్కిలిచుఱుకు వలన ఎడ తెలిపిగ్రహింపఁబడక పోవుటను అట్లు తోఁచుట.

౧౨౭ దిగ్భ్రమమునందుఁగూడ మఱియొక్కదిక్కు ఈదిక్కు యందుఁగలదుగాన అదృష్టవశమున ఈదిగ్భాగముతోఁ జేరని మఱియొక్క దిక్కుయొక్కభాగము గ్రహింపఁబడుచున్నది. కాఁబట్టి మఱియొక్కదిక్కుతోఁచుట యథార్థమే.

౧౨౮. ఇద్దఱుచంద్రులుతోఁచుట మొదలగుదానియందు. గాఢ వ్రేలితో నొక్కుట, తిమిరదోషము, మొదలగువానిచే నేత్రములోని తేజస్సునకు గతిభేదము కలుగుటవలన సామగ్రి (చంద్రుని గ్రహించుటకు సాధనమైనది) భేదించునుగాన రెండుసామగ్రులును ఒక్కదాని యపేక్ష మఱియొక్క దానికి లేకయె రెండు చంద్రజ్ఞానములు కలుగుటకు హేతువగుచున్నవి. అందు ఒక్క సామగ్రి వానిప్రదేశమందున్నచంద్రుని గ్రహించుచున్నది. రెండవది కొంచెము వంకరగానడచి చంద్రునిదగ్గఱ మున్నప్రదేశమును గ్రహించి వానిప్రదేశముతోఁ జేరని చంద్రునిగ్రహించుచున్నది. కాఁబట్టి రెండుసామగ్రులచే నొక్క పర్యాయము రెండుప్రదేశములతోఁగూడిన చంద్రుని గ్రహించుటలు భేదించుటను బట్టి గ్రహింపవలసినయాకారములు భేదించుటవల్లనును, ఒకటొకటియగుటగ్రహింపఁబడకపోవుటవల్లనును, ఇద్దఱుచంద్రులనెడి జ్ఞానవిశేషము కలుగుచున్నది. మఱియొక్కప్రదేశము అతనికి (చంద్రునకు) విశేషణమగుట, ఆప్రదేశమునను, తనప్రదేశము గ్రహింపఁబడనిచంద్రునిని, ఎడ తెలిపి లేక గ్రహించుటలో సంభవించును. అందుసామగ్రులు రెండగుటపారమార్థికమే. వానిచేత రెండు ప్రదేశములతోఁ గూడిన చంద్రుని గ్రహించుటలు రెండును పారమార్థికములై గ్రహించు

టలు రెండగుటచేత చంద్రుని యొక్క గ్రహింపఁబడెడియాకారములు రెండగుటయు పారమార్థికమె. అందు రెండు విశేషణములతోఁగూడిన చంద్రునిఁ గ్రహించుటలు రెంటికిని ఒక్క చంద్రుఁడే గ్రహింపఁబడువాఁడు అనుజ్ఞానమును కలుగఁజేయుటలో ప్రత్యభిజ్ఞయందువలె వట్టినేత్రమునకు సామర్థ్యము లేదుగాన కంటివలనఁగలిగిన జ్ఞానము అట్లే యుండును. రెండు నేత్రములును ఒక్క సామగ్రిలోఁ జేరియున్నను తిమిరము మొదలగు దోషములచే భేదించిన కంటితేజస్సు రెండు సామగ్రులగుననునది కార్యమునుబట్టి కల్పింపవలసినది. దోషము పోయినతరువాతను తన ప్రదేశముతోఁగూడిన చంద్రుఁడు ఒక్క గ్రహణముననె గ్రహింపఁబడునుగాన ఒక్కఁడెచంద్రుఁడను జ్ఞానము కలుగుచున్నది. సామగ్రిలు రెండగుట దోషమునఁగలిగినది. దానిచేఁ గలిగినది గ్రహించుటలు రెండగుట. దానిచేఁగలిగినది గ్రహింపవలసిన దానియాకారములు రెండగుట-అనియిట్లు నిర్దోషమె.

౧౨౯. కాఁబట్టి విజ్ఞానములన్నియును యథార్థములేయని సిద్ధమైనది. మిగిలినఖ్యాతులకు దూషణములు ఆయావాదులచేతనె విస్తరింపఁజేయఁబడినవిగాన ఆవిషయమున ప్రయత్నముచేయఁబడదు.

౧౩౦. లేదాయింతయుపపాదించుటయేల? ప్రత్యక్షము అనుమానను ఆగమముఅనెడి ప్రమాణంబులనును, ఆగమముచేఁదెలియఁబడునదియును అన్నిదోషములయు సంపర్కములేనిదియును మేలులేనియతిశయములుగలవై లెక్కపెట్ట శక్యముకాని కల్యాణగుణముల సమూహముగలదియును సర్వజ్ఞంబును సత్యసంకల్పంబునగు పరబ్రహ్మమును, నంగీకరించువారలకు ఏమిసిద్ధింపదు?, ఏమికుదురదు? జీవులపుణ్యపాపములకుఁదగునట్లు వారలచేననుభవింపఁబడుటకై జగత్తునంతయుసృజింపుచున్న భగవంతుఁడగు పరబ్రహ్మముచేత సుఖము, దుఃఖము, రెండునులేకుండుట, అనెడిఫలములననుభవించుటకై యనుభవింపఁదగినవిగానును, కొన్నిఆయాపురుషుఁడు మాత్రమె అనుభవింపఁదగినవై ఆయాకాలముననె కడతేరునవియై అట్టివారిచేతనె అనుభవింపఁబడఁదగినవిగానును, సృజింపఁబడుచున్నవి. వానిలో బాధ్యబాధకభావము, అంధటి యనుభవమునకును విషయమగుటనును, అది లేకపోవుటను

నకుదురుచున్నదిగాన అంతయును సమంజసము (యుక్తము) గా నున్నది.

౧౩౧ సత్తనికాని అసత్తనికాని నిర్వచింపశక్యముకాని యజ్ఞానము శ్రుతిచేతను సిద్ధించుననుట యుక్తముకాదు. (ఛా౹౮౹౩౹౨) అనృతేన హి ప్రత్యూఢాః, ఇత్యాదులయందు అనృతశబ్దము అనిర్వచనీయమును చెప్పునది కాదు. ఋతము కానిదానిని తెలియఁజేయునదిగదా యనృతశబ్దము. ఋతమనునది కర్మమును చెప్పునది. (కఠ౹౩వల్లి౹౧మ) ఋతంపిబన్తౌ (కర్మమును అనుభవించుచున్న) అను వాక్యమువలన. ఋతమనఁగా ఫలోద్దేశము లేనిదియును పరమపురుషుని యారాధనమే స్వరూపముగాఁ గలదియును అతనిం జేరుటయె ఫలముగాఁ గలదియు నగు కర్మము. ఇచ్చట అదిగాక సంసారములోని ఫలములు గల్గి పరబ్రహ్మమును చేరుటకు విరోధియగు కర్మము అనృతము. (ఛా౹౮౹౩౹౨౹) ఏతం బ్రహ్మలోకం నవిన్దన్తి అనృతేన హి ప్రత్యూఢాః (ఈ బ్రహ్మలోకమును పొందరు. అనృతముచేత ఆవరింపఁబడిరి కదా) అను వాక్యము ఇందుకు సాధకము.

౧౩౨. (తై౹౨౹౮కా౹౮ప్ర౹౯అ౹) నాసదాసీన్నో సదాసీత్తదానీమ్ (అప్పుడు అనఁగా సృష్ట్యాదియందు అసత్తనది లేకుండెను. సత్తనదియు లేకుండెను.) అను శ్రుతియందుఁ గూడ సత్ అసత్ అను శబ్దములు చేతనాచేతనముల వ్యష్టిని (సృష్ట్యవస్థను) తెలియఁజేయునవి. సృష్టికాలమున సత్ త్యత్ అను శబ్దములచేఁ జెప్పఁబడెడి చేతనాచేతన వ్యష్టులైన వస్తువులకు, ప్రళయకాలమునందు తమశ్శబ్దముచేఁ జెప్పఁబడెడి అచేతనసమష్టియగు వస్తువునందు ప్రళయమును తెలియఁజేయుటకొఱకైనది ఈవాక్యము. ఈ వాక్యమున ఏదియును సదసదనిర్వచనీయమగుట చెప్పఁబడలేదు. సదసత్తులు రెండును ఒకకాలమున లేకుండుటమాత్రము చెప్పఁబడినదిగదా. ఇందు తమశ్శబ్దముచేఁ జెప్పఁబడునది అచేతనమగుట, మఱియొక శ్రుతివలనఁ దెలియఁబడుచున్నది. (సుబా౹౨౹) అవ్యక్తమక్షరే లీయతే, అక్షరం తమసి లీయతె (అవ్యక్తము అక్షరమునలయమును బొందుచున్నది. అక్షరము తమస్సునలయమును బొందుచున్నది.) అని. ఔను, తమశ్శబ్దముచేత అచేతనసమష్టియైన ప్రకృతియొక్క సూ

త్సావస్థ చెప్పఁబడుచున్నది, దానికి (శ్వేతా॥) మాయాన్తు ప్రకృతింవి ద్యాత్, అని మాయాశబ్దముచేఁ జెప్పుటవలన అనిర్వచనీయత్వము క లుగును, అందురేని, ఇది సరికాదు- మాయాశబ్దము అనిర్వచనీయమును జె ప్పునదియగుట కానఁబడదు- మాయాశబ్దము మిథ్యాపర్యాయము (అసత్య మును జెప్పునది) గాన అనిర్వచనీయమును చెప్పునదియగును, అందురే ని, అదియును లేదు- మాయాశబ్దము అంతటను అసత్యమును జెప్పునది కాదు- అసురలు రాక్షసులు వీరలయస్త్రములు మొదలగు వానియందు స త్యములగు వానియందె మాయాశబ్దము ప్రయోగింపఁబడుచున్నది- ఎ ట్లన్నను- ( ) తేనమాయాసహస్రంతచ్ఛమ్బరస్యాశుగా మినా। బాలస్యరక్షతా దేహమేకైకశ్యేనసూదితమ్ (శీఘ్రముగా నడచు చు బాలుని శరీరమును రక్షింపుచున్న ఆ వ్యక్తిచేత శంబరాసురుని యొ క్క మాయలు వేయియును ఒక్కటియొక్కటిగా నశింపఁజేయఁబడిన వి) అని- కాఁబట్టి మాయాశబ్దము విచిత్రమైన వస్తువును సృజించు దానిం జెప్పునది- ప్రకృతి మాయాశబ్దముచేఁ జెప్పుటగూడ విచిత్రమై న వస్తువును సృజించునదియగుటనె- (శ్వేతా॥౪అ॥౯మ) అస్మాన్మా యీ సృజతేవిశ్వమేతత్ తస్మింశ్చాన్యోమాయయా సంనిరుద్ధః (ఇం దువలన మాయగలవాఁడగు భగవంతుఁడు ఈ జగత్తును సృజింపుచు న్నాఁడు- ఆ జగత్తునందు మఱియొకఁడు మాయచేత నిరోధింపఁబడి యున్నాఁడు) అనునది మాయాశబ్దముచేఁ జెప్పఁబడెడి ప్రకృతి, విచి త్రమైన వస్తువులను సృజించునదియగుటను చూపుచున్నది- పరమపు రుషుఁడు అది (మాయాశబ్ద వాచ్యమైన ప్రకృతి) కలవాఁడగుట మాత్ర ముననె మాయయగుట చెప్పఁబడుచున్నదిగాని అజ్ఞానముకలవాఁడ గుటను కాదు- తస్మింశ్చాన్యోమాయయా సంనిరుద్ధః అనియును (మా ణ్డూక్య॥౨౧) అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే (అ నాదియగు మాయచేత నిద్రను పొందియున్న జీవుఁడు ఎప్పుడు మేలుకొను నో) అనియును జీవునకే కదా మాయచేత నిరోధింపఁబడుట శ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది- (బృహ॥౪।౫॥౧౯) ఇంద్రో మాయాభిః పురురూ పఈయతె (పరమేశ్వరుఁడు విచిత్రశక్తులచేత అనేకస్వరూపములు గ ల్గినవాఁడుగాఁ దెలియఁబడుచున్నాఁడు) అన్నచోఁ గూడ విచిత్రమైనశక్తులు

చెప్పఁబడుచున్నవి. కావున నెకదా (                    )భారిత్వస్మిన్మహా
రాజతి (సృష్టికర్త ఇచ్చట విస్తారముగాఁ బ్రకాశించుచున్నాఁడు)
అని చెప్పఁబడుచున్నది. అసత్యమైనదానిచేఁ దిరస్కరింపఁబడిన
వాఁడు ఒకరుఁడును ప్రకాశింపఁడుగదా. (భ॥గీ॥౭అ॥౧౪శ్లో) మమ
మాయా దురత్యయా (నామాయ దాఁటశక్యముకానిది) అనుచోటఁగూడ
గుణమయీ అనుటవలన ఆత్రిగుణాత్మకమైన (సత్త్వరజస్తమోగుణ
ముల స్వరూపముగాఁగల) ప్రకృతి చెప్పఁబడుచున్నది. కాఁబట్టి శ్రుతుల
చేత సదసదనిర్వచనీయమైన యజ్ఞానము ప్రతిపాదింపఁబడుట లేదు.

౧౩౩ ఐక్యము చెప్పుట సందర్భంపము గాన భావరూపాజ్ఞాన
ము నొప్పుకతప్పదు. (ఛా॥౬॥౮॥౭) తత్త్వమసి (అబ్రహ్మము నీవగు
చున్నావు) అని ఐక్యము చెప్పఁగానే సర్వజ్ఞంబును సత్యసంకల్పంబు
ను అన్నిలోకములయు సృష్టిస్థితిసంహారములకు హేతువైనదియు
నుతత్ అనుశబ్దముచేతఁ జెప్పఁబడునదియు నగుప్రకృతమైన బ్రహ్మ
మునందు విరుద్ధమైన యజ్ఞానమును కల్పించుటకు హేతువగునను
పపత్తియొకటియును కనఁబడదుగదా. ఐక్యము నుపదేశించుటయందు
త్వంశబ్దముచేఁగూడ జీవుఁడు శరీరముగాఁగల బ్రహ్మమునే చెప్పు[illegible]
నతెన్సగాఁ గుదిరినది. (ఛా॥౬॥౩॥౨) అనేన జీవేనాత్మనా
[illegible]శ్యనామరూపే వ్యాకరవాణి (ఆత్మయయిన యీ జీవునితోఁ బ్ర[illegible]
మరూపములను ఏర్పఱిచెదను) అని సమస్తవస్తువును [illegible]
దుఁ జేరినదై నామరూపములను బొందునదియని [illegible] ండినది.
కాఁబట్టి బ్రహ్మమున నజ్ఞానము కల్పింపనక్కఱ [illegible]

౧౩౪. ఇతిహాసపురాణములలోఁగూడ [illegible] బ్రహ్మాజ్ఞాన వాదము
ఒకచోట నైనఁ గానంబడదు.

౧౩౫. (విష్ణు॥౨॥౧౨॥౩౮॥) జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణు
ర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ। నద్యస్సముద్రాశ్చ తథైవ సర్వం యద
స్తి యన్నాస్తి చ విప్రవర్య (ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా! సూర్యచంద్రాది
జ్యోతిస్సులు విష్ణువు. లోకములు విష్ణువు. అడవులు విష్ణువు. పర్వతము
లును దిక్కులును విష్ణువు. నదులును సముద్రములును ఇప్పుడున్నది
యొద్దియో యదియును ఇప్పుడు లేనిదియొద్దియో యదియును అతఁడే) అని

బ్రహ్మమొక్కటి యెతత్త్వమని ప్రతిజ్ఞ చేసి (౮౦ శ్లో॥) జ్ఞానస్వరూపో భగవాన్యతోఽసావశేషమూర్తిర్నతు వస్తుభూతః। తతో హి శైలాబ్ధి ధరాదిభేదాన్ జానీహి విజ్ఞానవిజృంభితాని (జ్ఞానస్వరూపుఁడైన ఈభగవంతుఁడు ఎందువలన సమస్తమైనవియును ఆకారముగాఁగలవాఁడో, వస్తువైనవాఁడుకాఁడో, అందువలనపర్వతములు సముద్రములు భూమి మొదలగు భేదములను జ్ఞానముచేఁ గలిగినవానిగాఁ దెలిసికొనుము) అనిపర్వతములు,సముద్రముల, భూమి,మొదలగుభేదములుగా భేదించియున్న జగత్తును,జ్ఞానమె స్వరూపముగాఁగల బ్రహ్మమునకు అజ్ఞానముచేఁగలిగినదానిగాఁ జెప్పి (౮౧ శ్లో॥) యదా తు శుద్ధం నిజరూపి సర్వకర్మక్షయే జ్ఞానమపాస్తదోషమ్। తదా హి సంకల్పతరోః ఫలాని భవన్తి నో వస్తుషు వస్తుభేదాః(ఎప్పుడు అన్నికర్మములును పోఁగాజ్ఞానము దోషము లేనిదై పరిశుద్ధమై తన స్వరూపముననున్నది యగునో అప్పుడు సంకల్ప వృక్షఫలములైన వస్తువులయందలి వస్తుభేదములు కలుగవు) ననిజ్ఞానమైన బ్రహ్మమునకే తనస్వరూపముననుండెడివేళను వస్తుభేదములు లేకపోవుటను జూపుటచేత అజ్ఞానవిజృంభితత్వమునె స్థిరపఱచి (౮౨,౮౩ శ్లో॥) వస్త్వస్తి కిం కుత్రచిదాది మధ్యపర్యన్తహీనం సతతైకరూపమ్। యచ్చాన్యథాత్వం ద్విజయాతి భూయో న తత్తథా తత్ర కుతో హి తత్త్వమ్। మహీ ఘటత్వం ఘటతః కపాలికా కపాలికా చూర్ణరజస్తతోఽణుః॥ జనైస్స్వకర్మస్తిమితాత్మనిశ్చయైరాలక్ష్యతే బ్రూహి కిమత్ర వస్తు (ఆదియును మధ్యంబును అంతంబును లేనిదై ఎల్లప్పుడు నొక్కవిధముగానుండెడి వస్తువు ఎచ్చటనైనం గలదా! ఓబ్రాహ్మణుఁడా! ఏది మఱియొక్క విధమునుపొందుచున్నదో అదివెండియు నాప్రకారము గానుండదు అచ్చటతత్త్వమెక్కడది? భూమిఘటత్వమును పొందును-అనంగా కుండయగును- కుండవలనఁ బెంకుకలుగును- దానివలనఁ జిన్నపెంకు కలుగును- దానివలన గుండకలుగును- దానివలన అణువు కలుగును- ఇచ్చట తమకర్మమున నిశ్చలమైన ఆత్మనిశ్చయముగలవారలచే ఏవస్తువు చూడఁబడుచున్నది? చెప్పుము) ఈ రెండు శ్లోకముల చేతను జగత్తునఁ బడెడి రీతినిగూడ వస్తువుల భేదములు అసత్య

ములగుటను తెలియఁజేసి(౨౨శ్లో)తస్మాన్నన్న విజ్ఞానస్మృతే అని ప్రతి
జ్ఞ చేయఁబడిన, బ్రహ్మముకన్న మిగిలినదంతయు నసత్యమగుటను, ఉ
పసంహరించి (౨౨శ్లో) విజ్ఞానమేకమ్ అని జ్ఞానస్వరూపమగు బ్ర
హ్మమునందు భేదజ్ఞానమునకు కారణమైనఅజ్ఞానమునకు మూలమై
నది తనకర్మమే యనిక్కుటపఱిచి (౨౪శ్లో) జ్ఞానం విశుద్ధమ్ అని
జ్ఞానస్వరూపమైన బ్రహ్మముయొక్క స్వరూపమును పరిశోధించి
(౨౬శ్లో) సద్భావ ఏవంభవతోమయొక్త అనిజ్ఞానస్వరూపమైన
బ్రహ్మమునకే సత్యత్వము, మఱియొకదానికి లేదు, మిగిలిన దానికి అ
సత్యత్వమే, ఆ లోకము మొదలగునది సత్యమగుటవ్యావహారికము,
ఇట్లు నీకుతత్త్వముపదేశింపఁబడినది అనికదా యుపదేశము కానఁబడు
చున్నది.

౧౩౮. ఇదిఇట్లుకాదు. ఇచ్చట భువనకోశముయొక్క విరివి
యైన స్వరూపముజెప్పి మఱియొకరూపస్వరూపమును సంక్షేపము
గా వినుమని మొదలుపెట్టి ఈగ్రంథము చెప్పఁబడుచున్నది. చేతనా
చేతన మిశ్రమైనజగత్తునందు చేతనాంశము వాక్కునకును మనస్సునకు
ను విషయముగానిది. తనకుమాత్రము తెలియఁదగిన స్వరూపభేదము
లుగలది. జ్ఞానమె స్వరూపముగాఁగలదగుటచే ప్రకృతిసంబంధమైన
భేదపుసంపర్కములేనిది-నశింపనిదిగాన అస్తి (కలదు) అనుశబ్దముచేఁ
జెప్పఁబడఁదగినది. ఆచేతనాంశమో, చేతనాంశములయొక్క కర్మ
ములవలనఁగలిగిన పరిణామభేదములు గలదై నశించునదిగాన నా
స్తి (లేదు) అనుశబ్దముచేఁ జెప్పఁబడఁదగినది. రెండును పరబ్రహ్మం
బగు వాసుదేవునకు శరీరముగానఁదగినవి-అని ఈరూపము సం
క్షేపముగా నిచ్చటఁజెప్పఁబడినది.

౧౩౯ అదిఎట్లన్నను (విష్ణు అం|| అ|| శ్లో) యదమ్బు వైష్ణ
వః కాయస్తతో విప్రవసుంధరా। పద్మాకారా సముద్భూతా పర్వ
తాబ్ధ్యాదిసంయుతా (ఓ బ్రాహ్మణుఁడా! విష్ణుసంబంధియగు శరీ
రమైన ఉదకమేదికలదో దానినుండిపర్వతములుసముద్రములు మొద
లగువానితోఁగూడిన భూమి,పద్మముయొక్క యాకారముగలదై యు
ద్భవించినది) అని ఉదకము విష్ణువుయొక్క శరీరముగాన తత్కప

కామమైన బ్రహ్మాండముగూడ విష్ణువునకు శరీరము, దానికివిష్ణువు ఆత్మ, అనిసమస్తశ్రుతులలోనుండెడి తాదాత్మ్యవ్యపదేశమునకు(మిగిలినదంతయు బ్రహ్మమేఅనిచెప్పుటకు) ఉపబృంహణ (వ్యాఖ్యాన) రూపముగ జ్యోతీంషివిష్ణుః అనిమొదలుపెట్టి చెప్పఁబడఁగలసామానాధికరణ్యమునకు (జగత్తెబ్రహ్మమనిచెప్పుటకు) శరీరాత్మభావమే( జగత్తుశరీరమగుటయు బ్రహ్మముఆత్మయగుటయునే) హేతువనిచెప్పుచున్నాఁడు- ఈశాస్త్రమునందు (పురాణమున)పూర్వముగూడననేక పర్యాయములు ఈయంశము చెప్పఁబడినది- (విష్ణు అం॥ ౬॥ శ్లో)తానిసర్వాణి తద్వపుః (అవియన్నియును ఆతనిశరీరము)(విష్ణు॥ అం॥ ౨॥ శ్లో)తత్సర్వం వైహరేస్తనుః (ఇదియంతయును విష్ణువుయొక్క శరీరముగదా)విష్ణు॥ ౨॥ అ॥ శ్లో) సఏవ సర్వభూతాత్మా విశ్వరూపోయతోవ్యయః(అతఁడెసమస్త భూతములకు నాత్మయైనవాఁడు- అతఁడుఎందువలనవిశ్వరూపుఁడును నిర్వికారుఁడనో) అని- శరీరాత్మభావమునుబట్టివచ్చినఆయీతాదాత్మ్యమును జ్యోతీంషి విష్ణుః అనిసామానాధికరణ్యముతో (అదియె ఇదియని) చెప్పుచున్నాఁడు· దీనిలో అస్త్యాత్మకంబును నాస్త్యాత్మకంబునైన జగత్తులోని వస్తువు,విష్ణువునకుశరీరమగుటను విష్ణ్వాత్మకమని చెప్పఁబడినది- ఇది అస్త్యాత్మకము (అస్తిఅని చెప్పఁబడునది), ఇదినాస్త్యాత్మకము (నాస్తిఅనిచెప్పఁబడునది), ఇదినాస్తి అనిచెప్పఁబడుటకు హేతువిది, అనిజ్ఞాన స్వరూపోభగవాన్యతోసౌ అనుదానిచేఁ జెప్పుచున్నాఁడు- సమస్తజీవస్వరూపముగానున్నభగవంతునకుజ్ఞానమె స్వాభావికమైన రూపము, దేవమనుష్యాది వస్తుస్వరూపము స్వాభావికముగాదు-ఇట్లగుటనె అచేతనరూపములగు దేవమనుష్య పర్వతసముద్రభూమ్యాదులు ఆతనిజ్ఞానముచేత విస్తరింపఁజేయఁబడినవి- అతఁడు జ్ఞానమె స్వరూపముగాఁగలవాఁడై యుండఁగానే దేవాదిస్వరూపమున తన యాత్మను అనేకవిధములుగాఁ దలంచుటచేఁగలిగినవి- దేవాదిస్వరూపమునందలంచుటకుమూలమగు కర్మముమూలముగాఁగలవి యనుట- ఎందువలన అచేతనవస్తువు జీవునికర్మమునకుఁదగిన పరిణామములకు ఆధారమైనదో అందువలననది నాస్తి అనుశబ్దముచేఁతె

ప్పఁబడునది. మిగిలినది అస్తి అనుశబ్దముచేతఁ జెప్పఁబడఁదగినది యని అర్థసిద్ధము (వెనుకఁ జెప్పినదానివలననే సిద్ధించునది) అగుచున్నది. ఆయంశమునే యదాతుశుద్ధం నిజరూపి అనుశ్లోకముచేత వివరించుచున్నాఁడు. జ్ఞానైకస్వరూపమగు నీయాత్మవస్తువు దేవాదిస్వరూపమున తనయందు అనేకవిధములను తలంచుటకుమూలమగు కర్మంబులన్నియును క్షయించినపైని ఎప్పుడు నిర్దోషమై పరిశుద్ధమైనదై తనస్వరూపముకలది అగుచున్నదో, అప్పుడు, దేవాద్యాకారములతో ఏకీభవింపఁజేసి అస్మానుకల్పించుటకుమూలమైనకర్మము లేవిగవో వానికిఫలములై, వానినిఅనుభవించుటకొఱకైన, వస్తువులయందలివస్తుభేదములు, కలుగవు. ఆత్మలుగాఁదలంపఁబడిన దేవాదివస్తువులయందు వానికిభోగ్యములైన దేవమనుష్య పర్వత సముద్ర భూమ్యాది వస్తుభేదములేవిగలవో యవి, వానికి మూలములైన కర్మములు నశించినపైని కలుగవుగాన, అచేతనవస్తువు ఒక్కప్పుడుమాత్రముండెడి అవస్థావిశేషమును కలదగుటచేత నాస్తి అనుశబ్దముచేఁ జెప్పఁబడుటయును, మిగిలినది ఎల్లప్పుడును స్వతస్సిద్ధమైనజ్ఞానమొకటియె స్వరూపముగాఁగల దగుటచేత అస్తి అనుశబ్దముచేఁ జెప్పఁబడుటయును, అనియర్థము. ప్రతిక్షణంబును మఱియొక్కవిధముగానుండుటచే ఒక్కప్పుడె యుండెడి యవస్థకల అచేతనవస్తువు, నాస్తి అనుశబ్దముచేఁ జెప్పఁబడుటయని వస్త్వస్తికిం అనుశ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు. అస్తిఅనుశబ్దముచేఁ జెప్పఁబడునది ఆదిమధ్యాంతములు లేనిదై ఎల్లప్పుడును ఒక్కవిధముగానుండెడి పదార్థము. అది ఎప్పుడును లేదనితోఁచుటకుఁదగదుగదా. అచేతనవస్తువు ఒక్కటియైనను ఒక్కచోటనైనను అట్టిదిచూడఁబడియుండలేదు. అయిననేమి యటన్నఁగా, యచ్చాన్యథాత్వమ్ అనుదానిని చెప్పుచున్నాఁడు. ఏవస్తువు ప్రతిక్షణంబును మఱియొక్కవిధమును పొందుచున్నదో అది పైపై యవస్థలను బొందుటచేత వెనుకటివెనుకటి యవస్థను విడుచుచున్నదిగాన వెనుకటి యవస్థతోఁగూడియుండిన యది పైయవస్థయందు తలంపఁబడుటలేదు, కాఁబట్టి ఎల్లప్పుడును అది నాస్తి అను శబ్దముచేఁ జెప్పఁబడునది యగుటయె, అట్లు కా

నఁబడుచునేయున్నది యని మహీఘటత్వమ్ అను శ్లోకము చేఁజె
ప్పుచున్నాఁడు- తనకర్మమునను అనఁగా దేవతలు మనుష్యులు మొ
దలైన వారలగుటను నిశ్చలమైన ఆత్మజ్ఞానము కలవారలచేతఁ
దమకుభోగ్యమైన అచేతనవస్తువు ప్రతిక్షణంబును మఱియొకవి
ధముగానైనదిగాఁ జూడఁబడుచున్నది- అనుభవింపఁబడుచున్నదియను
ట- కాఁగా పయచేతనవస్తువైనను అస్తి అనుశబ్దమునకుఁదగినదై ఎల్ల
ప్పుడు నొకవిధమైనరూపముకలదై చూడఁబడినదికలదా?, లేదుగదా
యని యభిప్రాయము- ఇట్లగుటను జ్ఞానస్వరూపమైన యాత్మకం
టెభిన్నమైన యచేతనవస్తువెప్పుడైనను ఎక్కడనైనను కేవలము అ
స్తిశబ్దముచేతఁ జెప్పఁబడఁదగినది కాదనితస్మాన్న విజ్ఞానమృతే
అను దానిచేతఁ జెప్పుచున్నాఁడు- ఆత్మయో, అంతటజ్ఞానమె స్వరూ
పముగాఁ గలవాఁడగుటచేత దేవాదిభేదములకు విరుద్ధమైన స్వరూప
ము గలవాఁడైనను, దేవాదిశరీరములలోఁ బ్రవేశించుటకు హేతువైతన
చేఁ జేయఁబడిన అనేకవిధములగు కర్మములు మూలముగా వచ్చిన దే
వాదిభేదములచే భిన్నములైనవి యాత్మలనెడి బుద్ధులుగలవారలచేత
ఆయారూపమున అనేకవిధములుగానను సంధానము చేయఁబడినవాఁ
డుగాన, ఆభేదానుసంధానముఆత్మస్వరూపమును బట్టి వచ్చినది కాదని
విజ్ఞానమేకమ్ అనుదానిచేఁ జెప్పుచున్నాఁడు- ఆత్మస్వరూపమో క
ర్మములేనిది, అందువల్లనె మలరూపమైన ప్రకృతి సంపర్కము
లేనిది, అందువల్లనె దానివలనఁగలిగిన శోకము లోభము మోహ
ము మొదలైన సమస్త హేయగుణముల సంపర్కమును లేనిది, వృద్ధి
క్షయములకు తగనిదగుటచేతను ఒక్కటైనది, అందువల్లనె ఎల్లప్పుడు
నొకరూపముగలది, అనివాసుదేవునకు శరీరముగాన వాసుదేవా
త్మకమైనది, వాసుదేవాత్మకము కానిది ఒక్కటియును లేకపోవుటవల
న, అనిజ్ఞానఁ విశుద్ధమ్ అనుశ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు- చేతనాం
శము ఎల్లప్పుడు నొక్కరూపముగా నుండుటచేఁ ఎల్లప్పుడును అస్తి
శబ్దముచేఁ జెప్పఁబడఁదగినది, అచేతనాంశమో ప్రతిక్షణంబును వి
కరించునదియగుటచేత ఎల్లప్పుడును నాశముతోఁ జేరియుండునదే
కాన ఎల్లప్పుడును నాస్తిశబ్దముచేఁ జెప్పఁబడఁదగినది, ఇట్టిచేత

నాచేతన స్వరూపమగు జగత్తు వాసుదేవునకు శరీరమై వాసుదేవాత్మకమని జగత్తుయొక్క యాథాత్మ్యము లెస్సగాఁ జెప్పఁబడినది, అనిసద్భావ ఏవమ్ అనుదానిచేఁ జెప్పుచున్నాఁడు- ఇచ్చట సత్యమ్ అసత్యమ్ అని, యదస్తి యన్నాస్తి (ఏదికలదో ఏదిలేదో) అని ఆరంభింపఁబడినదాని యుపసంహారము (నిగమనము)- జ్ఞానమొక్కటియె స్వరూపముగాఁ గలుగుటచేత సమమైనదియును శబ్దములకు గోచరము కాని స్వరూపభేదములు కలదియయియె అచేతనములతోఁ గూడినదియును బ్రహ్మాండములోఁ జేరినదియును దేవమనుష్యాదిరూపమున లెస్సగా వ్యవహరించుటకుఁ దగినదియునై ఏదికలదో దానియెడను హేతువు కర్మమే యని చెప్పఁబడినది, అని, ఏతత్తు యత్ అనుదానిచేఁ జెప్పుచున్నాఁడు- దానినె (విష్ణు॥ ౨౮౦॥ ౧౨౮॥ ౪౬శ్లో॥) యజ్ఞైః పశుర్వహ్నిరశేషఋత్విక్సోమస్సురాస్స్వర్గమయశ్చ కామః। ఇత్యాదికర్మాశ్రితమార్గదృష్టమ్ భూరాదిభోగాశ్చ ఫలాని తేషామ్॥ (యజ్ఞములు పశువు సమస్తమైన వహ్నియు ఋత్విక్కు సోమము దేవతలు స్వర్గస్వరూపమగు కామము ఈ మొదలగునది కర్మమూశ్రయించిన మార్గమునఁ గనఁబడినది- భూలోకానుభవము మొదలగు భోగములు వానిఫలములు)- అనుదానిచే వివరింపుచున్నాఁడు- జగత్తుయొక్క యథార్థస్థితిని తెలిసికొనుటకుఁ బ్రయోజనము మోక్షోపాయమును గూర్చి ప్రయత్నముఁ జేయుటయె యని (విష్ణు॥ ౨౨౦॥ ౧౨౮॥ ౪౭శ్లో॥) యచ్చైతద్భువనగతం మయాతవోక్తం సర్వత్ర వ్రజతిహి తత్ర కర్మవశ్యః। జ్ఞాత్వైవం ధ్రువమచలం సదైకరూపం తత్కుర్యాద్విశతిహి యేన వాసుదేవమ్ (నాచేతను ఈ లోకములోనిది ఏది చెప్పఁబడినదో దానియంతటియందును కర్మవశ్యుఁడైన జీవుఁడు సంచరింపుచున్నాఁడు-, అనుదీనిని తెలిసికొని నిత్యుఁడును పరిపూర్ణుఁడును ఎల్లప్పుడు నొక్క స్వరూపముగలవాఁడునగు వాసుదేవుని దేనిచేఁ జూచునో దానినాచరించునది)- అనుదానిచేఁ జెప్పుచున్నాఁడు-

౧౩౪. ఇచ్చట నిర్విశేషమగు పరబ్రహ్మమును గూర్చియైనను అది ఆశ్రయముగాఁగల సదసదనిర్వచనీయంబగు నజ్ఞానమును గూర్చియైనను జగత్తు దానిచేఁ గల్పింపఁబడుటను గూర్చియైనను అ

నుకూలమైనది ఒక్కమాటయైనను కానఁబడదు. అస్తినాస్తిశబ్దములచేఁ జెప్పఁబడెడి చేతనాచేతన స్వరూపమగు జగత్తంతయు గొప్పవాఁడును గొప్పవానికి ఈశ్వరుఁడును పరబ్రహ్మంబునగువిష్ణువునకు శరీరముగాన విష్ణ్వాత్మకమైనది. జ్ఞానమెస్వరూపముగాఁగలయాత్మకు, దేవత్వము మొదలుగాఁగలయనేకాకారములను అనుభవించుటయందును, అచేతనము పరిణమించుటయందును, హేతువు, వస్తుతత్త్వజ్ఞానమునకు విరోధియగు క్షేత్రజ్ఞుల కర్మమెయని ప్రతిపాదింపఁబడినదికదా. అస్తి, నాస్తి, సత్యమ్, అసత్యమ్ అను శబ్దములకు సదసదనిర్వచనీయమగు వస్తువని చెప్పెడి సామర్థ్యము లేదుకదా. నాస్తి అసత్యమ్ అనుశబ్దములు అస్తి సత్యమ్ అను శబ్దములకు విరోధులు. కాఁబట్టి వానివలన అసత్త్వము (లేకపోవుట) తోఁచుచున్నదిగాని అనిర్వచనీయత్వము తోఁచుటలేదు. ఇప్పట నాస్తి అసత్యమ్ అనుశబ్దములు తుచ్ఛత్వమును (కుందేటికొమ్ము వంటి దగుటను) మిథ్యాత్వమును (అసత్యత్వమును) తెలియఁజేయునవిగాఁ బ్రయోగింపఁబడలేదు. మఱియేమన్నను, నశించునవియగుటను తెలియఁ జేయునవిగాఁ బ్రయోగింపఁబడినవి. వస్త్వస్తికిమ్ మహీఘటత్వమ్ అనుచోట్ల నశించునది యగుటయెకదా ఉపపాదింపఁబడినది. ప్రమాణము లేక పోవుటగాని జ్ఞానముచే బాధింపఁబడుటగాని ఉపపాదింపఁబడలేదు. ఒక్కయాకారముతో నొక్క కాలమునననుభవింపఁబడినది మఱియొక్కకాలమునఁ బరిణామవిశేషమున మఱియొక్కవిధముగాఁగనఁబడుటను గదా నాస్తిత్వము (నాస్తి అనుశబ్దముచేతఁ జెప్పఁబడునదియగుట) ఉపపాదింపఁబడినది. తుచ్ఛత్వమనఁగా ప్రమాణములతోడి సంబంధమునకు తగనిదగుట (ప్రమాణములచేఁ దెలియఁబడనిదగుట). బాధమనునది ఏయేదేశకాలాదులతో సంబంధించి ఏదికలదని తెలియఁబడుచున్నదో, అది ఆయాదేశకాలాదులతో సంబంధించి లేదని తెలియఁబడుట. ఒక్కకాలమున ననుభవింపఁబడినది మఱియొక్క కాలమునఁ బరిణామము మొదలగు దానిచే లేదని తెలియఁబడుటకాదు. కాలభేదమును పట్టి ఆరెంటికిని విరోధము లేమిఁ గాఁబట్టి మిథ్యాత్వంబును కాదు.

౧౩౯. ఫలితార్థము- జ్ఞానస్వరూపమైన యాత్మవస్తువు ఆ
దిమధ్యాంతములులేనిదియును ఎల్లప్పుడు నొకవిధమైనస్వరూపముఁ గ
లదియునుగాన స్వయముగానె ఎల్లప్పుడును అస్తి (కలదు) అనుశబ్ద
ము చేఁ జెప్పఁబడఁదగినది- అచేతనమో, క్షేత్రజ్ఞులకు భోగ్యమైనదై
వారికర్మములకుఁదగినట్లు పరిణమించునదిగాన ఎల్లప్పుడును నాస్తి
(లేదు) అనునంశమును కలిగియుండునుగాన నాస్తి, అసత్యమ్, అను
శబ్దములచేఁ జెప్పఁబడఁదగినదియని- ఇందుకుప్రమాణము (విష్ణు॥ ౨అం॥
౧౩అ॥ ౧౦౦శ్లో॥) యత్తుకాలాన్తరేణాపి నాన్యసంజ్ఞాముపైతి
వై। పరిణామాదిసమ్భూతాం తద్వస్తు నృప తచ్చకిమ్ (ఓ
రాజా! ఏది కాలాంతరమునఁగూడ పరిణామము మొదలగువా
నిచేఁ గలిగినమఱియొకపేరును పొందదో, అదివస్తువు- అదిప
ది?- (౨అం॥ ౧౪అ॥ ౨౪శ్లో॥) అనాశీపరమార్థశ్చ ప్రాజ్ఞైరభ్యుపగ
మ్యతే। తత్తు నాస్తి న సందేహో నాశద్రవ్యోపపాదితమ్
(నశింపనిది పరమార్థమని ప్రాజ్ఞులచే నంగీకరింపఁబడు
చున్నది- నశించెడి ద్రవ్యముచేఁ గలుగఁజేయఁబడిన యది లేకు
న్నది- సందేహము లేదు) దేశము కాలము కర్మవిశేషములు వీనిని
బట్టి అస్తిత్వ నాస్తిత్వములను పొందెడివస్తువునందు అస్తి (కలదు)
అనెడిజ్ఞానము చేత మాత్రము తెలియఁజేయఁబడుట అపరమార్థ
ము (అసత్యము) అని చెప్పఁబడినది- ఒకయాత్మకె అస్తియనెడి బుద్ధి
చేఁ దెలియఁబడునదియగుట- కాఁబట్టి ఇదిపరమార్థమని చెప్పఁబడిన
ది- విసిష్ఠమైత్రేయుఁడుఁగూడ (విష్ణు॥ ౨అం॥ ౧౩అ॥ ౨శ్లో॥) విష్ణ్వాధారం యథా
చైతత్ త్రైలోక్యం సమవస్థితమ్। పరమార్థశ్చ మే ప్రోక్తో యథా
జ్ఞానం ప్రధానతః (ఈమూడులోకములును విష్ణువు ఆధారముగాఁ గ
లవై ఎట్లున్నవో జ్ఞానము ప్రధానముగానెట్లు పరమార్థమో అది
నాకుఁ జెప్పఁబడినది-) అని అనువదించుటవలనఁగూడ జ్యోతీంషి విష్ణుః
ఇత్యాదులలోఁ జెప్పఁబడిన సామానాధికరణ్యమునకు ఆత్మశరీర
భావమె మూలమునియు, చేతనాచేతనవస్తువులయందు అస్తినాస్తి
అనుశబ్దములను ప్రయోగించుటకు మూలము, జ్ఞానముకర్మమూలకము
గాని స్వాభావికస్వరూపము కలదగుటచేతఁ ప్రధానమగుటయు ఆ

చేతనవస్తువు వాని (చేతనుల) కర్మమును బట్టి వచ్చిన పరిణామము కల దగుటచేత అప్రధానమగుటయు ననియును తోఁచుచున్నది-

౧౮౦. నిర్విశేష బ్రహ్మజ్ఞానమువలననె అవిద్యానివృత్తి కలుగునని శ్రుతులు చెప్పుచున్నవి అని చెప్పినది యుక్తముకాదు- (ఉ॥ నా॥ రా॥) వేదాహమేతం పురుషం మహాన్తమ్। ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్। తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థా విద్యతేఽయనాయ (సూర్యునివంటి వర్ణముగలవాఁడును ప్రకృతికిపైవాఁడును అగు నీగొప్ప పురుషుని నేను భజించుచున్నాను- అతని నీలోకమున నిట్లు భజించువాఁడు ముక్తుఁడగుచున్నాఁడు- అతనిం బొందుటకు మఱియొక మార్గము లేదు-) (తై॥ నా॥ ౧౫॥ ౮...౧౦ మ॥) సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి।... న తస్యేశే కశ్చన తస్య నామ మహద్యశః।... య ఏనం విదురమృతాస్తే భవన్తి (మెఱుపువంటి వర్ణముగల పురుషుని వలన నన్ని కాలములును పుట్టినవి ... అతని నేలువాఁడొకఁడును లేఁడు- గొప్పకీర్తి అతని పేరు కదా... అతని నెవ్వరు భజింతురో వారు ముక్తులగుదురు) ఇవి మొదలగు ననేక వాక్యములు విరోధించును- బ్రహ్మము విశేషములతోఁ గూడినదియగుటనె అన్నివాక్యములును విశేషములతోఁ గూడిన దాని జ్ఞానముననె మోక్షమును జెప్పుచున్నది- శోధక వాక్యములుగూడ విశేషములతోఁ గూడిన బ్రహ్మమునె తెలియఁజేయుచున్నవని చెప్పఁబడినది-

౧౮౧. (ఛా॥ ౬॥ ౮॥ ౭॥) తత్త్వమసి (అది నీవగుచున్నావు) ఇత్యాది వాక్యములయందు సామానాధికరణ్యము నిర్విశేష వస్తువుయొక్క ఐక్యమును తెలియఁజేయునదికాదు- తత్ త్వమ్ అను పదములు విశేషములతోఁ గూడిన బ్రహ్మమునె చెప్పుచున్నవి- తత్ అను పదము సర్వజ్ఞంబును సత్యసంకల్పంబును జగత్కారణంబునగు బ్రహ్మమును పరామర్శించుచున్నది- తదైక్షత బహుస్యామ్ ఇత్యాది వాక్యములయందు అదియె ప్రశంసింపఁబడినది- దానితో సమానాధికరణమైన (దానికి విశేషణమైన) త్వమ్ అను పదంబుగూడ అచేతనములతోఁ గూడిన జీవుఁడు శరీరముగాఁగల పరబ్రహ్మమును ప్రతిపాదించుచున్నది- సామానాధికరణ్యము (విశేషణవిశేష్యభావము) రెండు ప్రకార

ములనున్న ఒక్క వస్తువును తెలియఁజేయునదికదా. రెండుప్రకార
ములను విడిచినచోఁ ప్రవృత్తినిమిత్తమునకు భేదములేకపోవుట చేతను
సామానాధికరణ్యము విడువఁబడినదియగును. రెండు పదములకును ల
క్షణ (అముఖ్యార్థమును చెప్పుట) గూడవచ్చును [గౌః=గోవు, పాచ
కః=వండువాఁడు, శుక్లమ్=తెల్లనిది, ఈశబ్దములచేఁ దెలియఁజే
యఁబడెడి, గోత్వజాతి, వండుటయనెడిక్రియ, తెలుపు అనెడిగుణము. ఇవి
ఈశబ్దములకు ప్రవృత్తినిమిత్తములు. ఇట్లు అన్నిశబ్దములయందును నూ
హించికొనునది.] సోయందేవదత్తః (ఆ ఈ దేవదత్తుఁడు) అనునప్పు
డుకూడ లక్షణయక్కఱ లేదు. భూతకాల వర్తమానకాల సంబంధము
నుబట్టి ఐక్యము తోఁచుట యందువిరోధములేదు. దేశవిరోధము కాల
భేదముచేఁ బరిహరింపఁబడినది. తదైక్షత బహుస్యామ్ అని యుపక్ర
మించుటతో విరోధముగూడ వచ్చును. ఒకటిదెలియుటచే నన్నియుం
దెలియుననెడి ప్రతిజ్ఞకూడ సంభవింపదు. జ్ఞానస్వరూపుఁడును దో
షములెవ్వియు లేనివాఁడును సర్వజ్ఞుఁడును సమస్తకల్యాణగుణస్వ
రూపుండును, అగువానికి అజ్ఞానము కలుగుటయు దానివలనఁబుట్టె
డి అనంతములగు అపురుషార్థములకు (పురుషులు కోరఁదగని దుఃఖా
ములకు) ఆధారమగుటయు కలుగుచున్నది.

౧౮౨. సామానాధికరణ్యము బాధముకొఱకైనచో త్వమ్ తత్
అను పదములకు అధిష్ఠానలక్షణయు నివృత్తిలక్షణయు ననెడి లక్షణలు మొ
దలగునవియె దోషములు [త్వయాదృష్టశ్చోరః స్థాణుః (నీచేఁజూడఁబడిన
దొంగ స్తంభము) అనుచో బాధార్థసామానాధికరణ్యము. అనఁగా స్తం
భమునందు ఆరోపింపఁబడినచోరత్వమును బాధించుటకై చోరుఁడు స్తం
భమని సామానాధికరణ్యము చెప్పఁబడినది. ఇట్లు త్వమ్ తత్ (నీవు ఆబ్ర
హ్మము) అని బాధార్థసామానాధికరణ్యము అద్వైతులచేఁ జెప్పఁబడినది]
నేదం రజతమ్ (ఇది వెండి కాదు) అనుచోటవలెఁ గాకమఱియొక్క ప్రమా
ణముచేఁ దెలియఁబడని బాధమును గతిలేక కల్పించుటయును, తత్ అనుపద
ములచేత అధిష్ఠానము తప్ప వేఱు ధర్మముతోఁ చెప్పఁబడకపోవుట చేత బాధముకు
దురకపోవుటయు, ననునింతియె విశేషము [ముత్యపుచిప్పను చూచి వెండి
యనుకొనినప్పుడు ఇది వెండి కాదనెడి బాధము ప్రత్యక్షముచేఁ దెలియఁబ

డనది గాన బాధమును కల్పింపవచ్చును-ఇచ్చట అట్లు మఱియొక్క ప్రమాణముచేఁ దెలియఁబడక పోయినను బాధమును కల్పింపవలసివచ్చుట దోషమని తాత్పర్యము] పూర్వము ఆవరింపఁబడిన యధిష్ఠానము ఆవరింపఁబడని స్వరూపముగలదై తత్ అనెడిపదముచేతఁ దెలియఁజేయఁబడుచున్నది అనినచో సరికాదు అధిష్ఠానము ప్రకాశింపని యప్పుడు అదియాధారముగాఁగల భ్రాంతియును బాధంబును సంభవింపవుగదా - భ్రమమునకాధారమగు నధిష్ఠానము ఆవరింపఁబడలేదంటిరేని ఆయధిష్ఠానస్వరూపమె భ్రమమునకు విరోధిగాన అది ప్రకాశించునప్పుడు అదియాధారముగాఁగల భ్రమంబును బాధంబును బొత్తిగా సంభవింపవు- కాబట్టి అధిష్ఠానముకంటె వేఱుగా పారమార్థికంబగు ధర్మమునను గుడియావరింపఁబడుటనను అంగీకరింపనియెడను భ్రాంతియును బాధంబును ఉపపాదింపఁదగవు- రాజును జూచి వ్యాధుఁడని భ్రమించినప్పుడు అధిష్ఠానమగు పురుషస్వరూపము పూర్తిగా తోచుచుండఁగా అదిగాక పారమార్థికమగు రాజత్వము (రాజస్వరూపము) ఆవరింపఁబడుచుండఁగానె కదా వ్యాధత్వభ్రాంతి కలుగుచున్నది- రాజత్వమును తెలియఁజేసినతోడనే అదినివర్తించుటయును కలుగుచున్నది-కాని అధిష్ఠానమును మాత్రము తెలియఁజేసినతోడనే కాదు- అది (అధిష్ఠానము) తెలియఁబడుచునె యున్నదిగాన తెలియఁజేయఁబడనక్కఱలేదు-అది (అధిష్ఠానము) భ్రమమునుపోఁగొట్టునదియును కాదు

౧౮౩. జీవుఁడు శరీరముగాఁగలవాఁడును జగత్తునకు కారణమైనవాఁడునగు బ్రహ్మమును చెప్పునెడను రెండుపదములును ముఖ్యార్థముగలవియగును- రెండుప్రకారములుగల ఒక్కవస్తువును చెప్పుటచేత సామానాధికరణ్యముగూడ సిద్ధించినది- దోషములెవ్వియు లేనిదియును సమస్త కల్యాణగుణాత్మకంబునగు బ్రహ్మమునకు జీవులకంతర్యామియగుటయనెడి మఱియొక్క యైశ్వర్యస్వభావముగూడఁ జెప్పఁబడినదియగుచున్నది-ఉపక్రమమునకు (ఆరంభమునకు) అనుకూలముగా నుండుట గూడఁగలుగుచున్నది- ఒక్కటి దెలిసినను అన్నియుం దెలియుననెడి ప్రతిజ్ఞగూడ కుదురుటకలుగుచున్నది- సూ

క్ష్మములైన(ప్రళయావస్థలోనుండెడి) చేతనాచేతనములు శరీరము
గాఁగల బ్రహ్మమె, స్థూలములైన (సృష్ట్యవస్థలోనుండెడి) చేత
నాచేతనములు శరీరముగాఁగలదగుటచేత కార్యమగును- (శ్వే॥౬
అ॥౭మ॥) తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్ (ఈశ్వరులకు గొ
ప్పయీశ్వరుఁడైనయాతనిని (శ్వే॥౬అ॥౮మ॥) పరాస్యశక్తిర్వివిధై
వశ్రూయతే (ఈతనిశక్తి గొప్పదియును అనేకవిధములైనదియునుగాఁ
జెప్పఁబడుచున్నది-) (ఛా॥౮॥౭॥౧) అపహతపాప్మా (పాపములు
లేనివాఁడు) సత్యకామస్సత్యసఙ్కల్పః (సత్యకాముఁడు అనఁగా
యథార్థములైన కల్యాణగుణములుగలవాఁడు- సత్యసంకల్పుఁడు
అనఁగాకోరినది సిద్ధించువాఁడు) ఇవిమొదలగు శ్రుత్యంతరములతో,
విరోధముకూడలేదు-

౧౪౪. (ఛా॥౬॥౮॥౭) తత్త్వమసి అనునప్పుడు ఉద్దేశ్యవి
ధేయవిభాగంబెట్లు? అంటిరేని, ఇచ్చటదేనినైన నుద్దేశించి విధియై
నను విధింపఁబడలేదు- (ఛా॥౬॥౮॥౭)ఐతదాత్మ్యమిదం సర్వమ్
అను దానిచేతనే ప్రాప్తమైనదగదా- అప్రాప్తమునందుఁగదా విధిసా
ర్థకమగును- ఇదం సర్వమ్ అని జీవులతోఁగూడిన జగత్తునునిర్దేశిం
చి ఐతదాత్మ్యమ్ అని దానికి ఈతఁడాత్మయని అచ్చట ప్రతిపాదిం
పఁబడినది- ఆవిషయమున (ఛా॥౬॥౮॥౬) సన్మూలాస్సోమ్యేమాస్స
ర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠాః (అనియీయందఱు ప్రజ
లును సత్తే అనగాపరబ్రహ్మమె మూలముగాఁగలవారు- సత్తే ఆధార
ముగాఁగలవారు-సత్తే ప్రతిష్ఠ అనఁగాలయమును బొందెడిస్థానము
గాఁగలవారు-) అనిహేతువుచెప్పఁబడినది-(ఛా॥౩॥౧౪॥౧)సర్వం ఖ
ల్విదం బ్రహ్మతజ్జలానితిశాన్తః (ఉపాసీత= ఇదియంతయును బ్ర
హ్మముగదా- ఆబ్రహ్మమువలనఁబుట్టినదియును ఆబ్రహ్మమునలయమ్ము
ను బొందునదియును ఆబ్రహ్మమువలనబ్రతుకునదియునునని శాంతిగల
వాఁడై యుపాసించునది-) అనినయట్లు -

౧౪౫. అట్లే మఱికొన్నిశ్రుతులుకూడ బ్రహ్మమునకును దా
నికంటె నితరములగు చేతనాచేతనవస్తువులకును శరీరాత్మభావము
నే (ఇదిశరీరమగుటనును అది యాత్మయగుటనును) తాదాత్మ్యమును

(ఐక్యమును) గాఁ జెప్పుచున్నది-

(తైత్తి॥ ఆర॥ ౩ప్ర॥) అన్తఃప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా (జనులకు లోపలఁ బ్రవేశించియుండి శాసకుఁడగువాఁడును అన్నిటికి నాత్మయగువాఁడును)-

(బృ॥ ౫అ॥ ౭బ్రా॥ ౩ఖ॥) యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః (ఎవఁడు భూమియందు ఉన్నవాఁడై భూమికి లోపలివాఁడో, ఎవనిని భూమి ఎఱుఁగదో, ఎవనికి భూమి శరీరమో, ఎవఁడు భూమిని లోపలనున్నవాఁడై నియమింపుచున్నాఁడో, వాఁడు, నీకు అంతర్యామియును నిత్యుఁడునగు నాత్మ)

(మాధ్య॥ బృహ॥) య ఆత్మని తిష్ఠన్నాత్మనోऽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః) ఎవ్వఁడు ఆత్మయందున్నవాఁడై ఆత్మకులోపలివాఁడో, ఎవనిని ఆత్మ ఎఱుఁగడో, ఎవనికి ఆత్మ శరీరమో, ఎవఁడు ఆత్మను లోపలనున్నవాఁడై నియమింపుచున్నాఁడో, వాఁడు, నీకు అంతర్యామియును నిత్యుఁడునగు నాత్మ)

(సుబాలో॥ ౭॥) యః పృథివీమన్తరే సంచరన్ (ఎవఁడు పృథివి లోపల సంచరింపుచున్నవాఁడో) అని మొదలుపెట్టి. యస్య మృత్యుశ్శరీరమ్ - - - యం మృత్యుర్న వేద ఏష సర్వభూతాన్తరాత్మాऽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః (ఎవనికి ప్రకృతి శరీరమో - - - ఎవనిని ప్రకృతి ఎఱుఁగదో ఈతఁడు సమస్తభూతములకును అంతరాత్మయైనవాఁడును పాపసంపర్కము లేనివాఁడును నిత్యవిభూతియందుండువాఁడును ప్రకాశించువాఁడును ఒకఁడునగు నారాయణుఁడు)

(తైత్తి॥ ఆన॥ ౬అ॥ ౨ఖ॥) తత్సృష్ట్వా। తదేవానుప్రావిశత్। తదనుప్రవిశ్య। సచ్చ త్యచ్చాభవత్ (దానిని సృజించి దానినే చొచ్చెను- దానిని చొచ్చి చేతనంబును అచేతనంబును అయ్యెను)-

ఇవి మొదలగు శ్రుతులు కలవు-

౧౪౬. దీనిలోఁ గూడ (ఈ సద్విద్యలోఁగూడ) (ఛా॥ ౬ప్ర॥ ౧ఖ॥

౹౹౩౹౹) అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి (ఈ జీవాత్మతోఁ బ్రవేశించి నామరూపములను వ్యక్తిజేదను) అని బ్రహ్మము ఆత్మగాఁగల జీవుఁడు చొచ్చుటని అన్నియును వస్తువగుటయు ను శబ్దములచేఁ జెప్పఁబడుటయు (పేరులుగలవగుటయు) నని ప్రతిపాదింపఁబడినది. తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్ అనుదానితో సమానార్థకమగుటను జీవుఁడు బ్రహ్మాత్మకుఁడగుట బ్రహ్మము (జీవునిలో) చొచ్చియుండుటనే యని తెలియఁబడుచున్నది. కాఁబట్టి చేతనాచేతనాత్మకంబగు సమస్తవస్తుజాతంబునకును గల బ్రహ్మతాదాత్మ్యము (బ్రహ్మమేయగుట) ఆత్మశరీరభావమువలననేయని తెలియఁబడుచున్నది. కాఁబట్టి బ్రహ్మముకంటె నితరమైన దంతయును బ్రహ్మమునకు శరీరమగుటనే వస్తువుగాన దానిని చెప్పెడి శబ్దములుగూడ ఆబ్రహ్మము పర్యంతమే తమయర్థమును చెప్పుచున్నది. కాఁబట్టి యన్నిశబ్దములును లోకవ్యుత్పత్తిచేఁ దెలియఁబడిన ఆయాపదార్థములతోఁగూడిన బ్రహ్మమును చెప్పునవి యగుట సిద్ధించినది. కాఁబట్టి ఐతదాత్మ్యమిదం సర్వమ్ అని ప్రతిజ్ఞ చేయఁబడినదానికి తత్త్వమసి అను సామానాధికరణ్యముచేత విశేషమున నుపసంహారము.

౧౮. ఇందువలన నిర్విశేషవస్తువు నైక్యమును వాదించువానికిని భేదాభేదమును వాదించువానికిని భేదమును వాదించువానికిని వైయధికరణ్యమునను సామానాధికరణ్యముననును బ్రహ్మమునకు ఆత్మభావమును (జీవుఁడగుటను) తెలియఁజేసెడి యుపదేశంబులన్నియు విడువఁబడినవి కావలయును. ఒకటియె యగు (అది తప్ప రెండవది లేని) వస్తువునందు దేని తాదాత్మ్యము పదేశింపఁబడుచున్నది? దానికె అనినచో, అది తనమాటచేతనే తెలియఁబడినదిగాన తాదాత్మ్యోపదేశముచే నిశ్చయింపవలసినది ఒకటియును లేదు. కల్పింపఁబడిన భేదమును పోఁగొట్టుటయే యనినచో, నది, సామానాధికరణ్య తాదాత్మ్యోపదేశముచేఁ (ఈయాత్మయె బ్రహ్మము అని చెప్పుటచేఁ) దెలియఁదగినది కాదని పూర్వమె చెప్పఁబడినది. సామానాధికరణ్యమో, బ్రహ్మమునందు ప్రకారములను రెండిటిని తెలియఁజేయుటచేత విరోధమునే కలుగఁజేయును. భేదాభేదవాదమున

నోబ్రహ్మమునందెడుపాధిసంబంధించుటవలనదానివలనఁగలిగెడిజీవుల యందుండెడి దోషములన్నియు బ్రహ్మమునందె కలుగును గాన అన్ని దోషములును లేనిదై కల్యాణగుణాత్మకమగు బ్రహ్మము ఆత్మయగుటను తెలియఁజేసెడి శాస్త్రములు విరోధమువలననె విడువఁబడినవిగా వలయును- భేదాభేదములు రెండును స్వభావసిద్ధములనెడి వాదంబునఁగూడ బ్రహ్మము స్వయముగానె జీవుఁడగుటగూడ అంగీకరింపఁబడుటవలన గుణములవలె దోషములుగూడ స్వభావసిద్ధములు గావలయును- కాననిరోధంబగు బ్రహ్మముతోడి తాదాత్మ్యము నుపదేశించుట విరుద్ధమె- కేవలభేదవాదులకో బొత్తిగా భిన్నములైన వానికి ప్రకారముగానైనను ఐక్యము సంభవింపదుగాన బ్రహ్మమె ఆత్మయగుటను తెలియఁజేసెడి శాస్త్రములు సంభవింపవు- కావుననే అన్ని వేదాంతములను విడుచుటసంభవించును-

౧౪౪. సమస్తోపనిషత్తులయందును ప్రసిద్ధమైయున్న ఆత్మనః (ఆతనికి) శరీరమగుటను అవలంబించుచున్న వారలచే సంతయును బ్రహ్మాత్మకమగుటను తెలియఁజేసెడి శాస్త్రములన్నియు లెస్సగా నుపపాదింపంబడినవి అగుచున్నవి- జాతిగుణములవలె ద్రవ్యములుగూడ శరీరమగుటను విశేషణములుగాన పురుషుఁడు కర్మములచేత గోవును అశ్వంబును మనుష్యుఁడును దేవుఁడునయ్యెను అనిసామానాధికరణ్యము లోకమునందును వేదమునందును ముఖ్యముగానె చూడఁబడినది- జాతిగుణములుగూడ ద్రవ్యమునకు ప్రకారములగుట, ఖణ్డో గౌః (పొట్టియావు) శుక్లః పటః (తెల్లనిబట్ట) అనిసామానాధికరణ్యమునుబట్టి వచ్చినదికదా- మనుష్యత్వము మొదలగువానితోఁగూడిన పిండములుగూడ ఆత్మకు ప్రకారమగుటనె పదార్థములుగదా- ఆత్మ, మనుష్యుఁడును, నపుంసకుఁడును, స్త్రీయును, అయ్యెను అనిసామానాధికరణ్యము అంతట ననుగతమయినదిగానప్రకారమగుటయె సామానాధికరణ్యమునుబట్టి వచ్చినది- అన్యోన్యవ్యావృత్తములయిన (ఒకదానియందుండి మఱియొకదానియందుండనివైన) జాతి మొదలగ్నునవి కావు. తనయందుండెడి ద్రవ్యములే ఒకప్పుడెఒకట చోటనె ద్రవ్యమునకు విశేషణములగునెడను మత్వర్థీయప్రత్యయ